పండిత శ్రీరామశర్మ ఆచార్య, మాతా భగవతీ దేవిగార్ల సంరక్షణలో

# యుగసంధి ప్రబోధం

(యుగస్పృజేతల సింహనాదం)

సంపుటి : 4 | అక్టోబర్ 98 | సంచిక : 5



భారతదేశం తిరిగి జగద్గురు పీఠాన్ని అధిష్ఠించి తీరుతుంది.

# నివేదన

మాన్య సోదర సోదరీమణులారా ....... నవరాత్రులు సుసంపన్నం చేసి గురువులకు పూర్తి నమ్మకాన్ని కలిగించ గలిగిన సాధకులందరికి కృతజ్ఞతలు.

పూజ్య గురుదేవులు శ్రీ శ్రీ రామకృష్ణగారు విశ్వకుండలినీ జాగరణకై మూలాధారం శ్రీశైలం నుండి సహస్రారం తిరుపతి వరకూ ఒక్కొక్క చక్రాన్ని జాగరణ చేయిచేందుకు ప్రణాళిక సిద్ధపరిచారు. అందులో భాగంగా నవంబరు 20, 21, 22 తేదీలలో శ్రీశైలంలో మొదటి సాధనా శిబిరము నిర్వహింప తలపెట్టినారు. మొత్తం ఈ ప్రణాళికకు మహాకాలుని వద్ద అనుమతి తీసుకొని వచ్చేందుకు 18, 19, 20 (అక్టోబరు) తేదీలలో ఉజ్జయిని నందు సాధనా శిబిరము జరుపుటకు కూడా నిర్ణయించారు. దానికి గాను కొంత మంది సాధకులు 16-10-98 రాత్రి చెన్నై - జైపూర్ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి ఉజ్జయిని వెళ్ళుచున్నారు. రాదలచుకున్న వారెవరైనా దేవమాత గౌతమి ట్రస్టు కన్వీనర్ రామసుబ్బయ్యగారికి (0863) 353164 నెంబరుకి ఫోన్ చేసి చెప్పగలరు. అలా అవకాశం లేకపోతే డైరెక్టుగా ఆట్రెన్ టైమ్‌కి రాత్రి 11 గం. విజయవాడ రైల్వేస్టేషన్‌లో నైనా నన్ను కలసినా సరిపోతుంది. మొత్తము సంపూర్ణ విశ్వాన్నే అద్భుత మలుపు త్రిప్పే మహోన్నతమైన ఈ అవకాశాన్ని ఏ మాత్రం వీలున్నా జారవిడుచు కొకండి. దీపావళి శుభాకాంక్షలతో .... శలవు.

ఇట్లు
మీ ఎడిటర్

జై మహాకాల్ - జైజైమహాకాల్
యుగసంధి కాలపు అంతిమ దిన

కౌంట్‌డైన్ 450 రోజులు

(అక్టోబరు 7వ తేదీకి)



సుకృతవిల్లా,
50 వేణుగోపాలనగర్,
గుంటూరు.
తేది : 1-10-'98.

నా ఆత్మీయయుగ సైనిక మిత్రులారా,

నవరాత్రి సుసంపన్న మైనది. మనకు తెలిసినా తెలియకున్నా కొన్ని అద్భుతాలు జరిగాయి. ఏమిటీ ఆ అద్భుతాలంటే శ్రీశైలం విలువ తిరుపతి కంటే మెల్లి మెల్లిగా పెరిగింది. (అంటే తిరుపతి విలువ తగ్గుతుందనికాదు. దాని విలువ దానిదే). దానికి బీజాలు ఈ నవరాత్రులలో పడినవి. శ్రీశైలం అంటే ఏమిటో తెలియని మానవ జాతికి దాని ప్రాముఖ్యత రానున్న కొన్ని నెలలో చాలా స్పష్టంగా అర్థం అవుతుంది. దానకి కావలసిన పునాది ఈ నవరాత్రులలో పడింది.

రెండవ అద్భుతం అంతర గ్రహయాత్రకి పునాది పడింది. ఎలా పడింది? ఎప్పుడు పడింది? నేనేం చెప్పలేనిపుడు. శ్రీశైలంలో వున్న పృధ్వీ గ్రహ మూలాధారా (ఇష్టకామేశ్వరి) జాగరణతో పాటు అంతర గ్రహాలకు చాలా మంది వెళ్ళగలరు. చంద్రగ్రహ యానం చేయాలంటే అమెరికాలోని నాసా కేంద్రంలో 4 సంవత్సరాలపాటు చాలా తీవ్రమైన ట్రైనింగ్ పొందాలి. మామూలు ట్రైనింగ్ కాదు ఒళ్ళు హూనం అయే ట్రైనింగ్ పొందాలి. మరి అంతర్ గ్రహ యాత్రకు ఏ ట్రైనింగ్ పొందాలి? అనే విషయానికి బీజాలు ఈనవరాత్రులో పడిపోయాయి. దీపావళి లోపు దీని గురించి పేపర్ల ద్వారానో లేక వేరే దాని ద్వారానో తెలుస్తుంది. ఈ 9 రోజులలో ఇతరగ్రహాలకు మనసాధకులలో కొంతమంది వెళ్ళివచ్చారు గ్యారంటీగా. ఇది మాకు ఎలా తెలుస్తుంది మాష్టారు? అంటే మీజీవితాలలో

ఊహించని మార్పులు జరుగుతున్నాయంటే మీరు ఇతరగ్రహాలకు వెళ్ళివచ్చినట్లే నేను వెళ్ళాలంటే ఎలా మాస్టారు? మీమానసిక దృక్పధములో మార్పురావాలి. మీరు శరీరధారులుగా ఉన్నారు. బాధలు వచ్చినా ఆవచ్చిన భాధలు మీశరీరానికే తప్ప మీకు కాదు అనే భావన స్థిరంగా ఉండాలి. ఈ విధమైన మానసిక స్థితి ఉంటే మీరు అంతరగ్రహయాత్ర అర్హతనంపాధించినట్లే. మీ జీవితంలో మీరూహించని సంఘటనలు జరిగితే మీరు వెళ్ళి వచ్చినట్లే.

ఇంకొక అద్భుతం ఏవింటంటే మీరువూహించలేని, నమ్మలేని అద్భుతం మానవ శరీరధారులంతా, శరీరధారులు కాని జీవాత్మలు కూడా ఆధ్యాత్మిక జగత్తులో మొదటి మెట్టుదాటారు. మీరు చేసిన ఈ నవరాత్రి సాధన మనవజాతికి ఇంతటి మహోన్నతను అందించిదంటే అదో గొప్ప. నేనెప్పుడూ చెపుతుంటాను గదా మాతాతగారు ఆయన బావమరిది కలిసి 100 ఉపవాసాలు చేసారు. అందులో 99 మాతాతగారి బావమరిది చేసాడు. ఒకటి మాతాతగారు చేసారు. కానీ 100 ఉపవాసాలు చేసిన ఘనత యిద్దరికీ కలిపి లభించింది. అలా మీరు చేసే సాధనలు కూడా ఉండరాదు. ముఖ్యంగా అష్టమినాడు రాత్రి జరిగిన మార్పు మానవ శరీరధారు లందరిని అధ్యాత్మిక జగత్తులో మొదటిమెట్టు ఎక్కించింది. దానికి నవరాత్రులలో ప్రూఫ్స్ ఇక్కడే లభించినవి.



ఇంకోటి ఏంజరిగింది? ఇతరలోకాలనుండి......... ఇదికొంచం తికమక. కానీ మీరు జాగ్రత్తగా అర్ధం చేసుకుంటే మీలో కొందరిలో దానికి కావలసిన బీజాలు ఉన్నవి. గత ఎన్నో జన్మలుగా దాన్ని సాధించు కోవటానికి ఆత్మాహూతి

ప్రయత్నాలు కూడా చేసారు. ఏమిటంటే ఈ ఒకటిన్నర సంవత్సరాలలో పృథ్వి స్వయంగా దీక్షతీసుకొ బోతుంది. అంటే మన శరీరం మీద అనేక బాక్టీరియాలు ఉన్నాయి. కంటికి కనిపించనంత చిన్నవి. 98-4 డిగ్రీలవేడి ఈ శరీరం నుండి బయటకు వస్తొంటే ఆబ్యాక్టీరియా లేమను కుంటున్నాయి? ఇక్కడో పెద్ద సూర్యుడున్నాడు. అందువలన ఇంతవేడి వస్తొంది అని. మీరు డిగ్రీ పుచ్చుకున్నారు. ఆబాక్టీరియాకు అర్థంకాదు. ఎందుకని? అది అంత చిన్నది. దాని పరిధి అంతవరకే. అలాగే మనం కూడా పృథ్వీమీద నివశిస్తున్న బాక్టీరియాలమే. పారసైట్‌లమే. భూమి ఈ9రోజులలో క్రొత్త దీక్ష తీసుకుంది. మరి మానవుల కర్థం కాలేదు కదా.



మరి మీరు డిగ్రీ తీసుకుంటే బ్యాక్టీరియాకు అర్థం అవుతుందా? అలాగే ఇది. మరి మనకుఎలా అర్థంఅవుతుంది? భూమి ఎలా పుట్టింది? అది మనలను ఎలా భరిస్తుంది? అని పృధ్వీ గురించి ఆలోచించే వారికి పృధ్వీ యొక్క ఆత్మతో దగ్గిర సంబంధం ఉంటుంది. కనుక మన కర్థం అవుతుంది.

ఇన్ని మార్పులు తెచ్చిన ఈ నవరాత్రి కొన్ని క్రొత్త బాధ్యతలు కూడా తీసుకువచ్చింది. శ్రీశైలం నాలుగు ద్వారాలను సాధకులకు అనుకూలంగా మర్చటం. త్రిపురాంతకం, ఉమామహేశ్వరము, అలంపురం, సిద్ధవటంలలో వాటి ధర్మకర్తలతో, పూజారులతో సంబంధం పెట్టుకొని అక్కడ అభివృద్ధి పథంవైపు నడవడం. ఈనాలుగు క్షేత్రాలూ మూలాధారం(శ్రీశైలం)నకు వున్న 4 దళాలకు ప్రతీకలు మాత్రమే. ఇంతేకాక శ్రీశైలం నుండి తిరుపతికి వెళ్ళేదారి మధ్యలో 5 సిద్ధక్షేత్రాలున్నాయి. అన్ని క్షేత్రాలలో ఆసుపత్రులు రావాలి. ఖచ్చితంగా అవి ఏర్పడతాయి. ఏ చక్రానికి సంబంధించిన జబ్బులు నయంచేయటానికి ఆచక్రం వద్ద ఆసుపత్రి పనిచేస్తుంది. ఇదంతా మీకున్న అవగాహన మీకే

కాకుండా ఇతరులకి పంచగలిగితే ఆస్థలాలలో హాస్పటల్స్ నిర్మాణం చేయగలరు.

1971 లోనే మొదలు పెట్టబడినా.....ఈ నవరాత్రికి అది చాలా అద్భుత రూపం దాల్చింది. భూమి దిక్ష తీసుకున్న ఈ తరుణంలో, శరీరధారులంతా ఆధ్యాత్మిక జగత్తులో మొదటి మెట్టు ఎక్కిన ఈతరుణంలో కొన్ని వేలమంది దివ్య శరీరధారులు భూమి చుట్టూ ఒక వలయంగా ఏర్పడ్డారు. రాబోయే రెండున్నర సంవత్సరాలలో ఆదివ్య శరీరధారులతో మీరు సంపర్కం పెట్టుకోదలుచుకుంటే వారు రేడీ. హల్యూషనేషన్స్‌లో పడిపోకండి. దివ్యాశరీరధారులతో సంపర్కం అంత తేలికకాదు. పరిణామ క్రమంలో వారు మనకంటే కోట్ల కోట్ల సంవత్సరాలు ముందున్న వారు. యమమడు, విశ్వకర్మ మొదలైన వారితో సంపర్కంపెట్టుకోవచ్చు. రోజుకు 4 గంటల సమయం వెచ్చించగలగాలి. అనేక వనరులు సమకూర్చుకోవలసి ఉంటుంది.

ఈ నవరాత్రులలో జరిగిన ఇంకొక అద్భుతం, మానవ శరీరమే వేదస్వరూపం. ఆ నాలుగు వేదాలు కూడా ఈశరీరం నుండి ఏనాదం వినిపిస్తున్నాయో తెలియజేసే ప్రక్రియను తెలియజేసే బీజాలు కూడా ఈ నవరాత్రులలో మన కందించ బడిన అద్భుత వరాలు స్వీకరించండి వానిని. మీలో ఎవరు ఏకార్యక్రమాన్ని తీసుకోగలరో? తీసుకోదలచుకున్నారో? తెలియజేసి దానికి సంబందించిన విషయాలను. ఈ రోజునుండి మీరు ముఖ్యంగా ఈక్రింది విషయాలను విధిగా పాటిస్తూ మీరు ఆచరణాత్మక జీవితాలను సాగించండి.

1. ఉదయం ఒక గంట, సాయంత్రం ఒక గంట విధిగా గాయత్రీ మంత్రజపం.
2. వారానికి కనీసం 4 గంటలు సాహిత్యపఠనం.
3. ఋషిమయ మానసికస్థితిలో జీవించుట.

పై మూడు సాధనలను విధిగా పాటిస్తూ, పైనిచ్చిన కార్యక్రమాలలో మీరు ఏ విధమైన ఎదుగుదలను ఎదిగేందుకు ఏసాధనలు చేస్తున్నారో గమనిస్తూ ముందుకు కదులు తారని ఆశిస్తూ...స్వస్థి



# గాయత్రీ పంజరము

గాయత్రీ పరమాత్మ శక్తి. పరమాత్మ శక్తి అంతటా అణువణువులోనూ, బ్రహ్మాండ మంతటిలోనూ వ్యాప్తమై ఉన్నది. ఉన్నదంతయూ గాయత్రీ మయయే. గాయత్రీ శరీరమునందే ఈజగత్తు అంతయూ ఉన్నది. ఈభావనచే గాయత్రీ యొక్క విరాడ్రూప దర్శనమగును. క్రింద ఈయబోవు గాయత్రీ పంజర స్తోత్రము నందు ఈ విరాట్ దర్శనమే ఉన్నది. పంజరమనగా చట్రము. గాయత్రి యొక్క చట్రము- గాయత్రియొక్క పంజరము ప్రపంచ మంతటిలో ఉన్నది. ఇది ఈస్తోత్రమునందు చెప్పబడినది. ఈ స్తోత్రము భావనా సహితముగా ధ్యానించినచో అంతర్లోకములోనూ, బాహ్యజగత్తులోనూ, విరాట్ గాయత్రీ దర్శనమగును. ఆ దర్శనము వలన పోలీసులచే చుట్టుముట్టబడిన వ్యక్తి దొంగతనము చేయుటకు ప్రయత్నించనట్లు పాపము చేయుటకు ఎవ్వడునూ సాహసించడు.



ఈ గాయత్రీ పంజరములో 18శ్లోకాలు కలవు. ఈ 18 అర్థం అయితే మానవుడు మాధవుడు కాగలడు. ఈ 18 చెప్పటానికి వ్యాసభగవానుడు 18 పురాణలు, 18 ఉపపురాణములు వ్రాసాడు. అందులో అద్భుత గ్రంథము మహాభారతంలో 18 పర్వాలు వ్రాసాడు. అందులోని భగవద్గీతలో 18 అధ్యాయాలుగా వ్రాసాడు. ఒక్కొక్కటి అవగాహన చేసుకొని చివరిమెట్టు ఎక్కిననాడు మానవుడు మాధవుడు కాగలడు. అదే ఈనాడు భౌతిక చదువుకూడా 18 తరగతులు ( 18 సంవత్సరాలుగా ) విభజించారు. 10+2(ఇంటర్)+3(డిగ్రీ)+2(పోస్టుగ్రాడ్యుయేషన్)+1(డాక్టరేట్) మొత్తం (18 సంవత్సరాలుగా. ) గా చదివితే ఇక అతడు ఆ సబ్జక్టులో పూర్తి జ్ఞాని అయినట్లే అని డాక్టరేట్ ఇస్తున్నారు. కనుక ఈ 18 శ్లోకాల గాయత్రీ పంజరం జాగ్రత్తగా చదివి అకగాహన చేసుకోండి.

1. భూర్భువః సువరిత్యేతైర్నిగమత్వ ప్రకాశికామ్ ।
మహర్జన స్తపః సత్యలోకోపరి సుసంస్థితామ్ ॥

భావం: గాయత్రి భూః, భువః,స్వః వీని ద్వారా నిగమత్వమును వెల్లడించును. మహః, మంచి జనః తపః, సత్యః -ఈ లోకముల కంటే పైన ఉన్నది.

2. గానాదినా వినోదాది కథాల పేషు తత్పరామ్ ।
తదిత్యవాజ్ మనోగమ్య తేజో రూపధరాం పరమ్ ॥

భావం: గానము మున్నగు వినోదముల యందు, కథాదులయందు తత్పరమగు ఈమె వాక్కు కంటే, మనస్సు కంటే అగమ్యమైనప్పటికీ గొప్ప తేజస్సును ధరించియున్నది.

3. జగతః ప్రసవిత్రీం సవితుః సృష్టి కారిణీమ్ ।
వరేణ్య మిత్యన్నమమీం పురుషార్థ ఫలప్రదామ్॥

భావం: జగత్తును సృష్టించునట్టి ఆమెను సవితను సృష్టించునదియని చెప్పిరి. వరేణ్యమనగా అన్నమమి. ఆమె పురుషార్థమును ఇచ్చునట్టిది.

4. అవిద్యా వర్ణ వర్జ్యాం చ తేజో వద్గర్భ సంజ్ఞికామ్ ।
దేవస్య సచ్చిదానంద పరబ్రహ్మ రసాత్మికామ్ ॥

భావం: ఆమె అవిద్య, వర్ణము, సవిత, తేజస్సుతో కూడినది. గర్భ సంజ్ఞకమైనది.సచ్చిదానంద పరబ్రహ్మ రసమయమైనది.

5. యద్వయం ధీమహి సాలై బ్రహ్మాద్వైత స్వరూపిణీమ్ ।
ధియో యోనస్తు సవితా ప్రచోదయా పాసాసితామ్ ॥

భావం: అద్వైత స్వరూపిణియు, సవితృ స్వరూపమగు మా బుద్ధిని ఉపాసనకై ప్రేరేపించు నట్టి ఆమెను మేము ధ్యానించుచున్నాము.

6. తాదృగస్యా: విరాడ్రూపం కిరీటవర రాజితామ్ ।
వ్యోమ కేశాలకాకాశం రహస్యం ప్రవదామ్యహమ్ ॥

భావం: ఇట్లు ఆమె విరాట్ రూపము కలది. సుందర కిరీటమును ధరించినట్టిది. వ్యోమము కేశములుగా కలది. ఆకాశము ముంగురులు ఇలా ఈమె రహస్యము చెప్పబడినది.

7. మేఘభ్రకుటికా క్రాన్తాం విధి విష్ణు శివార్చితామ్।
గురు భార్గవ కర్ణాంతాం సోమసూర్యాగ్ని లోచనామ్

భావం: ఆమె మేఘములు కనుబొమ్మలుగా కలది. బ్రహ్మ, విష్ణు,

మహేశ్వరులచే అర్చింప బడునది. గురు, శుక్రులు చెవులుగా కలిగినది.
సూర్య, చంద్ర, అగ్నులే నేత్రాలుగా కలది.

8. పింగలేడా ద్వయం నూనం వాయునాసా పుటాన్వితాః।
సంధ్యేభమోష్ట పుటితాం లసద్వాగుప జిహ్వికాయే ॥

భావం: అమె రెండు ముక్కు పుటములే ఇడా పింగళలు. రెండు సంధ్యలు రెండు ఓష్ఠములు (పెదవులు). ఉపజిహ్వామ్ వాక్కు.

9. సంధ్యాద్యుమణి కంఠాంచ లసద్బాహు సమన్వితామ్ ।

కళాకారులుగా ఒక స్థాయిగాని లక్ష్యము గాని లేదు. వారిలో ఎక్కువమంది ధనవంతుల భట్రాజులుగా ఉంటున్నారు. అలా ఆలోచించి ఏమి వ్రాయమని నిర్దేశించబడుతున్నారో అదే చేస్తున్నారు. ప్రచురణ ఒక వ్యాపారమైపోయింది. ఈనాడు అనేక పేపర్లు పత్రికలు ప్రచురింపబడుతున్నాయి. పుస్తములు కూడా అచ్చు అవుతున్నాయి. కాని ఎక్కడా రచనలలో స్వతంత్ర గొంతులేదు. స్వేచ్ఛలేదు. ప్రచురణకర్త ఏది లాభసాటి అనుకుంటారో రచయిత అదే వ్రాస్తాడు. ఎందువల్లనంటే రచయితకు తన స్వామి భావలకు అనురూపంగా వ్రాస్తేనే ధనము లభిస్తుంది. లాభములేని చోట ప్రచురణకర్త ధనమును వినియోగించడు కదా! రచయితకు తనదైన ప్రకాశ్య వ్యవస్థ లేదు. ఉన్న ఒకటో అరో ప్రతిస్పర్థ (పోటీ) కి తట్టుకోలేక ఎలాగోలా నెట్టుకు రాబడుతున్నాయి. ఇటువంటపుడు, వీరికి కొనుగోలుదారులు లభించుటలేదు. ఇటువంటపుడు ఫ్రీప్రెస్ ఉండీ లేనట్టే వుంటుంది. రచయితలు, ఆలోచనాపరులు, దార్శనికులు ఇప్పుడు లేనట్టే లెక్క.

మనీషులలో రెండవవర్గం వైజ్ఞానికులది. పురాతన కాలంలో వైజ్ఞానికుల బాధ్యత దార్శనికులే తీసుకునేవారు. భౌతిక క్షేత్రంలో అభిరుచి కల్గిన వారు చరకుడు, కణ్వుడు, నాగార్జునుడు, యాజ్ఞవల్కుడు. ద్రోణాచార్యుడు భౌతిక అనుసంధానాలు చేసేవారు. లేక వ్యాసుడు, కపిలుడు, వశిష్టుడు, గౌతముల వలె యుగ దర్శనానికి క్రొత్త అధ్యాయాలు తెలిపేవారు.

ఈనాడు పై ఇరువర్గాల పరిస్థితి అంతంత మాత్రగానే వుంది. వైజ్ఞానిక ఆవిష్కరణలలో సైంటిఫిక్ రీసెర్చ్‌లో ఒకతరంవారు చాలా కృతకృత్యులై ప్రసిద్ధిగాంచారు. సాధారణ యోగ్యతలే ఉన్నప్పటికీ సామాన్య జనులకు అసాధారణ లాభములు ఇచ్చేవి కనిపెట్టారు. ఇప్పుడు విద్యుత్తు మానవ జీవితము యొక్క అవిచ్ఛిన్న అంగము అయిపోయింది. దీని తర్వాత వాహనాలది -సైకిల్ నుంచి, రైలు, మోటారు, స్టీమరు, ఏరోప్లేన్లు దూర ప్రయాణాలను

పర్జన్య హృదయాసక్తాం వసు సుస్తన మండలమ్ ॥

భావం: సంధ్యారూపమగు ద్యుమణిచే కంఠము ప్రకాశించుచున్నది. బాహువులు శోభిల్లుచున్నవి. పర్జన్యము హృదయము. స్తనమండలము వసువు.

10. వితతాకాశముదరాం సునాభ్యంతద దేశకామ్ ।
ప్రాజాపత్యాఖ్యజఘనాం కటీంద్రాణీతి సంజ్ఞికామ్ ॥

భావం: ఆకాశము,ఉదరము అంతరదేశము నాభి, జఘనము ప్రజాపతి. కటి(నడుము) ఇంద్రాణి.

11. ఊరూ మలయమేరుభ్యాం సన్తియత్రా సురద్విషః
జానుసీ జన్నుకుశికా వైశ్వదేవ సదాభుజామ్ ॥

భావం: రెండు ఊరువులు(తొడలు) మలయ, మేరు పర్వతములు. అక్కడ అసుర దేషులు(దేవతలు) నివసించుచుందురు. జానువుల (మోకాళ్ళ) యందు జన్నువు, కుశికుడు ఉన్నారు. భుజములు విశ్వేదేవులు.

12. అయన ద్వయజంఘాద్య సురాది పితృ సంజ్ఞకామ్ ।
పదాంఘ్రినఖ రోమాది హేతలద్రామ లాంభితామ్ ॥

భావం: రెండు జంఘములు (పిక్కలు) రెండు అయనములు,సురాది పితృసంజ్ఞకమైనవి. పాదములు, అంఘ్రులు(కాళ్ళు), గోళ్ళు, రోమములు మొదలైనవి భూమి యందలి చెట్లు మొదలయినవిగా చెప్పబడినవి.

13. గ్రహరాశి దేవర్షయో మూర్తించ పరసంజ్ఞకామ్ ।
తిధిమాసస్తు వర్షాఖ్య సుకేతు నిమిషాత్మికామ్ ॥
మాయాకల్పిత వైచిత్ర్యా సంధ్యాచ్ఛాదన సంవృతామ్ ॥

భావం: గ్రహాలు, రాసులు, దేవతలు, ఋషులు, పరసంజ్ఞకమగు శశియొక్క మూర్తులు. తిధులు, మాసములు, ఋతువులు, సంవత్సరములు, సుకేతువు మున్నగునవి నిమేషములు(కనురెప్పలు).మాయారచితమగు వైచిత్ర్యముతో గూడినది, సంధ్యతో ఆవరింపబడియున్నది.

14. జ్వలత్కాలానల ప్రభాం తడిత్కోటి సమప్రభమ్ ।
కోటిసూర్య ప్రతీకాశమ్ చంద్రకోటి సుశీతలమ్ ॥

భావం: కాలాగ్నివలె జ్వలించునట్టిది. కోట్లకొలది మెరుపులవలే ప్రకాశించునట్టిది. కోట్ల కొలది చంద్రులవలె చల్లనైనది.

15. సుధామండల మధ్యస్థాం సాంద్రానందా2మృతాత్మికామ్।

పర్జన్య హృదయాసక్తాం వసు సుస్తన మండలమ్ ॥

భావం: సంధ్యారూపమగు ద్యుమణిచే కంఠము ప్రకాశించుచున్నది. బాహువులు శోభిల్లుచున్నవి. పర్జన్యము హృదయము. స్తనమండలము వసువు.

10. వితతాకాశముదరాం సునాభ్యంతద దేశకామ్ ।
ప్రాజాపత్యాఖ్యజఘనాం కటీంద్రాణీతి సంజ్ఞికామ్ ॥

భావం: ఆకాశము,ఉదరము అంతరదేశము నాభి, జఘనము ప్రజాపతి. కటి(నడుము) ఇంద్రాణి.

11. ఊరూ మలయమేరుఖ్యాం సన్తియత్రా సురద్విష:
జానునీ జన్నుకుశికా వైశ్వదేవ సదాభుజామ్ ॥

భావం: రెండు ఊరువులు(తొడలు) మలయ, మేరు పర్వతములు. అక్కడ అసుర దేషులు(దేవతలు) నివసించుచుందురు. జానువుల (మోకాళ్ళ) యందు జన్నువు, కుశికుడు ఉన్నారు. భుజములు విశ్వేదేవులు.

12. అయన ద్వయజంఘాద్య సురాది పితృ సంజ్ఞకామ్ ।
పదాంఘ్రినఖ రోమాది హేతలద్రామ లాంభితామ్ ॥

భావం: రెండు జంఘములు (పిక్కలు) రెండు అయనములు,సురాది పితృసంజ్ఞకమైనవి. పాదములు, అంఘ్రులు(కాళ్ళు), గోళ్ళు, రోమములు మొదలైనవి భూమి యందలి చెట్లూ మొదలయినవిగా చెప్పబడినవి.

13. గ్రహరాశి దేవర్షయో మూర్తించ పరసంజ్ఞకామ్ ।
తిధిమాసస్తు వర్షాఖ్య సుకేతు నిమిషాత్మికామ్ ॥
మాయాకల్పిత వైచిత్ర్యా సంధ్యాచ్ఛాదన సంవృతామ్ ॥

భావం: గ్రహాలు, రాసులు, దేవతలు, ఋషులు, పరసంజ్ఞకమగు శశియొక్క మూర్తులు. తిధులు, మాసములు, ఋతువులు, సంవత్సరములు, సుకేతువు మున్నగునవి నిమేషములు(కనురెప్పలు).మాయారచితమగు వైచిత్ర్యముతో గూడినది, సంధ్యతో ఆవరింపబడియున్నది.

14. జ్వలత్కాలానల ప్రభాం తడిత్కోటి సమప్రభమ్ ।
కోటిసూర్య ప్రతీకాశమ్ చంద్రకోటి సుశీతలమ్ ॥

భావం: కాలాగ్నివలె జ్వలించునట్టిది. కోట్లకొలది మెరుపులవలే ప్రకాశించునట్టిది. కోట్ల కొలది చంద్రులవలె చల్లనైనది.

15. సుధామండల మధ్యస్థాం సాంద్రానందా2మృతాత్మికామ్।

ప్రాగతీతఃమనోరమ్యాం వరదాం వేదమాతరమ్ ॥

భావం: సుధామండలం మధ్యలో ఆనందముతోను అమృతముతోనూ కూడినట్టిది. ప్రాగతీతమైనది. మనోహరమైనది. వరములను ఇచ్చునట్టిది. ఆమె వేదమాత.

16. షడంగా వర్ణితాం సాచత్రైరేచ వ్యాపకత్రయమ్ ।
పూర్వోక్త దేవతాం ధ్యాయేత్ సాకార గుణ సంయుతామ్ ॥

భావం: ఆరు అంగములు గలది. ముల్లోకములలోనూ వ్యాపించినట్టిది. వెనుక చెప్పబడిన ఈ గుణములతో గూడిన దేవతను ధ్యానించవలెను.

17. పంచ వక్త్రాం దశభుజాం త్రిపంచనయనైర్యుతామ్ ।
ముక్తావిద్రుమ సౌవర్ణాం స్వశ్ఛ శుభ్ర సమాననామ్ ॥

భావం: ఐదు ముఖములు, పది భుజములు. పదునైదు నేత్రములు గలది. ముత్యముతో, పగడముతో సమానమగు సువర్ణము, శ్వేతము (తెలుపు) శుభ్రమునగు ముఖము కలది.

18. ఆదిత్య మార్గ గమనాం స్మరేద్బ్రహ్మ స్వరూపిణీమ్ ।
విచిత్ర మంత్ర జననీం స్మరేద్విద్యా సరస్వతీమ్ ॥

భావం: ఆమె సూర్యమార్గముద్వారా పోవునట్టిది. బ్రహ్మ స్వరూపిణీయగు అమెను స్మరించవలెను.

## మేధావులను కుదిపివేసే ప్రయత్నం

ఒకప్పుడు ఋషి, ముని, మనిషి, దార్శనికులు సమాజంలో సర్వోచ్ఛ వర్గంగా భావించ బడేవారు. వారి ప్రతిసాధననాధ్యక్షులకు, ధనాధ్యక్షులకు అన్యోన్య విశిష్ట వర్గములకు మాన్యమయ్యేది. వారి మాటలను పెడచెవిని పెట్టే దుస్సాహసం ఎవరూ చేసేవారు కాదు. ఎందువలనంటే సమయానుకూలా మార్గ నిర్ధారణలో వారి సామర్థ్యం, వర్చస్వం అసాధారణం.

దార్శనికులు మొదటి వర్గంలోకి వస్తారు. వీరు శాస్త్రము రచించి, ఆ కాలపు సమస్యలకు సమాధానాలు ఇచ్చేవారు. ప్రవచనాలు ఇచ్చే వ్యాస పీఠములమీద వీరి అధికారమే ఉండేది. రాజు నుంచి నిరుపేద వరకు వీరికి అసామాన్య మాన్యత ఉండేది. ఈనాడు కూడా ఈవర్గం రచయితలుగా, కవులుగా,

సాలభ్య సాధ్యం చేసాయి, బరువు మోత ఖర్చు కూడా చాలా తగ్గింది. అందువల్ల అనేక రకాల వ్యాపారాలు తీవ్రగతిలో వృద్ధి చెందాయి. టెలిఫోన్, రేడియో, టి.వి.ల ఉపయోగం కూడా అదే విధంగా వృద్ధి చెందింది. ఆ యుగంలో మానవ జీవిత నిత్యావసరముల పూర్తి, వైజ్ఞానికులు చేసి అసాధారణ సహాయం అందించారు. ఉత్పాదన కవసరమయ్యే అనేక చిన్న-పెద్ద యంత్రాల ఆవిష్కరణకి కూడా. మానవజాతి వారికి కృతజ్ఞతగా ఉంటుంది. పంపు మొదలైనవి ఈ శ్రేణికి చెందుతాయి.

కానీ ఈవర్గం కూడా దార్శనికుల వలెనే తమ గరిమను ఉంచుకో లేక పోయింది. అవిష్కర్తలకు తమదైన ఉత్పాదన క్షేత్రం లేదు. అందువల్ల వారు ధనవంతుల కొరకు పనిచేయ వలసి వచ్చింది. ఇక్కడనుండీ అంతా గందరగోళం అయింది. చిత్ర పరిశ్రమలోని శిక్షణ చాలా ఉపయోగకరంగా ఉండి ఉండేది కాని దానిని ఉపయోగించే తీరు చూసి చాలా బాధ వేస్తుంది. ప్రెస్ కూడా ఒక అద్భుత మైన శక్తి. కాని ఆ క్షేత్రంలో కూడా ఉపయోగపడేది చాలా తక్కువ. పనికి రానిది చాలా ఎక్కువ ముద్రిత మవుతోంది. చిత్రాలు చూసేవారు, పుస్తకాలు చదివేవారు వీటినుంచి దూరంగా ఉంటేనే మంచిదనే అభిప్రాయానికి వచ్చారు.

ఈరోజుల్లో షుమారు 50వేల మంది ఉచ్ఛశ్రేణికి చెందిన వైజ్ఞానికులు కొత్త కొత్త ఆయుధాలు నిర్మించే పనిలో నిమగ్నమై యున్నారు. దీనివలన వీరికి పూర్తి సన్మానమేగాక, వలసినంత ధనంకూడా లభిస్తున్నది. ఇంతగా ఇతరత్రా పొందలేరు. అందువలన వారి మౌలికమైన ఆలోచనా విధానాలు మంచి మార్గంలో ఉపయోగించడానికి వీలుకాదు. సంపత్తి, సుఖసామాగ్రి అంటే అందరికీ ఇష్టమే. వారు దార్శనికులైనా- వైజ్ఞానికులైనా దీనికి ఇష్టపడతారు. అందువల్ల ఇప్పటి స్థితిని చూచి ఈ ఇరువర్గాలలో స్వతంత్ర ఆలోచనా విధానం లుప్తమైనదని భావించవచ్చును. ఇరువురూ, ధనవంతుల కొరకు పనిచేయవలసి వస్తోంది.

ఇది దుర్భాగ్య పూర్ణమైన దుర్గతి. దీనినుంచి బయటపడటమెలా? బయటకు తీసేవారెరు? కుటీర పరిశ్రమకు సంబంధించిన అనేక యంత్రములు వైజ్ఞానికులు తయారు చేయవలసి యున్నది. ఇవేగానితయారుచేయబడితే అనేకమంది నిరుద్యోగం నుండి రక్షింపబడుటయే కాక అభావజన్య కష్టానుండి తప్పించుకోగల్గుతారు. ఇంటిలో ఉపయోగింపబడే పిండిమర, నూనెగానుగ, చెరఖా, హాండ్‌లూమ్స్, కంసాలి, వడ్రంగి, కుమ్మరానికి సంబంధించిన యంత్రాలు కనిపెట్టగలిగితే సామాన్య జీవితంలో సుఖం పెరగడమే గాక

ఆదాయం కూడా పెరుగుతుంది. చవకగా ఉండే పంపుసెట్టు అందరికీ అవసరమే. కాగితాన్ని తయారు చేసే పరిశ్రమను ప్రతి పల్లెటూరి యందు నెలకొల్పవచ్చును. సూర్యుని వేడితో నడిచే కుంపట్లవల్ల ఖర్చు లేకుండా వేడినీళ్ళు పొందడమేగాక, వంట చేసుకోవడానికి, ఎండబెట్టుటకు పనికి వస్తుంది.

పైన కొన్ని ఉదాహరణ లీయబడ్డాయి. ఎడ్లబండ్లలో చాలా మార్పులు తీసుకుని రావచ్చును. కార్లు, సైకిళ్ళు, వీటిద్వారా నడిపించ వచ్చును. అవే ఖరీదైన పెట్రోలుకు ప్రత్యామ్నాయంగా ఉపయాగపడ్తాయి. యీ పన్లన్నిటినీ మన వైజ్ఞానికులు తయారు చేయడానికి సమర్థత కలిగినవారే. ఈ యంత్రాల ఉత్పాదనే చాల పెద్ద పరిశ్రమగా మారవచ్చును కానీ ఇటు వంటి ప్రయత్నాలేమీ కనిపించటలేదు. కుటీర పరిశ్రమ పేరుమీద జరుగుచున్నది. హాస్యాస్పదముగా ఉండి, స్థాపించిన వారికి మోయలేని భారంగా మారుతోంది. తయారు కాబడిన యంత్రాలన్నీ మనస్పూర్తిగా నిర్మించబడక షిప్‌షెడ్ గా తయారయ్యాయి. ఈ యంత్ర నిర్మాతలకి అవిష్కర్తలకి మధ్య మనస్సులో నిజమైన పారస్పరిక సంయోగ మేర్పడి దాని కవసరమయ్యే ధనం లభించి ఉంటే ఉపభోక్తలకు అద్భుతమైన లాభాలు వచ్చి ఉండేవి. సహకార సంఘాల ద్వారా ముడిసరుకు ఇప్పించబడి తయారైన వస్తువులకు వుపయుక్తమైన మార్కెట్ ను ఇప్పించగలిగి ఉంటే పరిస్థితులు వేరొకలాగున ఉండి యుండేవి. అప్పుడు మనము కేవలము వ్యవసాయం మీదనే ఆధారపడియుండే వారము కాము. పేడ మాత్రమేగాక, ఇతర చవక ప్రాకృతిక వనస్పతులు, ఎరువులు కనిపెడుతూ ఉండి యుండే వారము. పశువుల కొఱకు ,, అధిక దిగుబడి నిచ్చే పంట, సంవత్సరం పొడుగునా ఎదిగే గడ్డిని పెంచినపుడు పశుపాలన ఒక నష్టపోయే వ్యవసాయంగా మిగిలి యుండేది గాదు.

ఎవరు ఎవరికి పిర్యాదు ఇవ్వలి? ఈనాడు దేశమంతటా ఒక్క ప్రణాళికా బద్ధమైన కుటీర పరశ్రమలు విస్తరించాలి. జరగడానికి అది ఇప్పటికి అమలు అయినట్టు కనపడ్డా అది అపరియాప్తము, అసంతోషజనకము, మన వైజ్ఞానికులకు, నిర్మాతలకు, ఉపభోక్తలకు జపాన్ లోనున్నటువంటి స్థితి ఉండి వుంటే మనదేశంలో కూడా అన్ని క్షేత్రాలలో చమత్కారాలు సాధించి ఉండేవారు. కాని ఇది ఎలా జరుగుతుంది? ప్రతి ఒక్కరికీ రెండు చేతులతో ను సంపాదించాలి అని ఉన్నప్పుడు ప్రతిభలన్నీ విదేశాలకు, పెట్టుబడిదారీ దేశాలకు వలసపోతాయి .కుటీర పరిశ్రమలు ఎక్కడెక్కడున్న యో అవన్నీ నష్టంలో ఉన్నాయి. ముందడుగు

వేసిన ప్రతి ఒక్కరి ఉత్సాహము నీరు కారిపోతోంది.

ఇదేమాట దార్శనికులకు, మనీషులకు వర్తిస్తుంది. కాలం ఎంత వేగంగా ముందుకు వెళుతోందో ఆ అనుపాతంలోనే సమస్యలుకూడా పెరిగాయి. చిక్కుముడులు పడ్డాయి. అవన్నీ కూడా బుద్ధిసంగతమైన వ్యవహారికమైన తథ్యాలమీద నిర్ధారిత సమాధానాలు పొందగోరుతున్నాయి. ఇటువంటి మార్గదర్శనం చేయగలిగే సాహిత్యం రచింపబడి, అచ్చయి పాఠకులకు ఉచిత మూల్యంలో లబిస్తే ఎంత బాగుండును. కాని యీ క్షేత్రం గూడ అంధకారమయంగా ఉంది.



ప్రతిరోజు పుస్తకాల పేరుతో లక్షలాది కాగితాలు నల్ల బడుతున్నాయి. ప్రతిరోజు ఏదో ఒక మేగజైను మార్కెట్లోకి వస్తోంది. అన్నీ అచ్చవుతున్నాయి. అమ్ముడౌతున్నాయి. ఇవన్నీ ఎవరో ఒకరు వ్రాస్తునే ఉన్నారు. కాని ఆది నుంచి అంతం వరకు ఈ ముద్రణల సమీక్షిస్తే నిరాశ మాత్రమే లభిస్తోంది.

సాధారణ జనులకు అవసరమైన విషయాల గురించి గంభీరంగా అలోచించి వెనుకబడిన మన దేశ పరిస్థితులలో సమన్వయం కుదిర్చి ఉపయోగపడేది యేమైనా చేయబడుచున్నదా అనేదే ప్రశ్న. ఇంగ్లీషు పుస్తకాల కాగితాల నటు నిటు త్రిప్పి వాటిని తమ పేరుతో ప్రాంతీయ బాషల్లోకి ముద్రించకోవటం జరుగుతుంది. తక్కువ కాలంలో చేసిన శ్రమకు ఎక్కువ ఫలితాన్ని పొందడానికి ఈ విధానమే సులభముకూడ. సమయానుకుల, వ్యవహారిక , తథ్యపూర్ణమైన సమస్యానివారణోపాయాల నంద జేయడమే కర్తవ్యంగా భావించే మనీషులు కరువయ్యారు. 17 సం॥ లు నిరంతర పరిశ్రమచేసి గ్రంథం వ్రాసే కారల్ మార్క్స్ ఏరి? పాత బట్టలు సైజ్ చేసి తనకి, పిల్లలకి బట్టలను తయారు చేసి భర్త తపస్సును బలపరిచే భార్యలేరి?

దార్శనిక, వైజ్ఞానిక క్షేత్రాలు శూన్యమో లేక వాటిస్థాయి దిగజారడం, దారి తప్పడం చాలా బాధాకరమైన విషయం. ఈ స్థాయివ్యక్తులు తాము దిగజారి, దిశాభ్రమ కలుగచేసే రచనలు చేస్తే దాని ప్రతిక్రియ చాల భయంకరముగా ఉంటుంది. పూర్వకాలంలో వారినే బ్రహ్మరాక్షసులనే వారు. ఇప్పటి వారికీ కొత్త నామకరణం జరిగిందో లేదో తెలియదు కాని ఖచ్చితంగా ఆ బ్రహ్మ రాక్షసుల

తరమే ప్రోది చెందుతోంది.

ఇది ఈనాటి వస్తుస్థితి యొక్క పర్యవేక్షణ, దీనివల్ల ఏముతుంది? సమీక్షలు, తిట్టడాలు నిత్యము జరుగుతునే ఉన్నాయి. ఈ చెవితోవిని, ఆచెవితో వదలి వేయడం జరుగుతోంది. పని జరిగేటట్లు చూడాలి. ఇప్పుడు నేను అదే చేయబోతున్నాను. వైజ్ఞానికులు, దార్శనికులు నాయొక్క ముందు యుద్ధానికి ఉపయోగపడే ఘాతక శస్త్రాల నిర్మాణానికి తమ బుద్ధిని ఉపయోగించవద్దు అని వైజ్ఞానికులను బలవంతం చేస్తాను. ఇరుపక్షాలవారు తమ వైజ్ఞానికులు, తమ గెలుపు సునిశ్చితంచేసే అమోఘ ఉపాయాలను కనిపెట్టి, ఎదుటివారు వికలాంగులు కావాలని కోరుకుంటున్నారు. సూక్ష్మీకరణ తర్వాత అలా జరుగకుండా నేను చూస్తాను. ఉచ్చస్తరీయ వైజ్ఞానిక ప్రతిభ వారి తెలివి తేటల నుంచి ఈ విధమైన ఉపయోగం పొందనివ్వకుండా చూస్తాను. వారి సామర్థ్యాలు ఇంక కుటీర పరిశ్రమలకు సహాయపడే ఉపకరణాలు నిర్మించడానికి ఉపయోగపడే దానికి అనుకూల వాతావరణం త్వరిత గతిలో నిర్మించబడుతుంది. దీనికి ఉదాహరణగా నేను నా ముందే ఒక నమూనా తయారచేసి వెళ్తున్నాను.

రచయితల, దార్శనికుల, క్రొత్తవర్గం అవిర్భవిస్తుంది. అది తన ప్రతిభ మీదే ఆధారపడి ఒంటరిగానే ఆలోచించడం, వ్రాయడం చేస్తుంది. వారి లక్ష్యసిద్ధికి సహాయ సహకారాలు లభిస్తాయి. వారి మస్తిష్కం చైతన్యవంతమైన కవాటాలు తెరచుకుని ఈ రోజులలో వ్రాయవలసింది స్పష్టంగా గోచరిస్తుంది.

సంపన్నుల సహాయం తీసుకోకుండా, నేటి పుస్తక విక్రేతలు ఎక్కువ లాభాల కొరకు తలవొగ్గకుండా, సాధారణ జనులకు ఉపయోగపడే సత్ సాహిత్యమును ఇంటింటికి ప్రచురణ ధరకు ఇవ్వగలమా? నాకు ఇది సంభవమే అని విశ్వాసము. కాలము తన అవసరానికి తగిన మార్గాలు అన్వేషించుకుంటుంది. సర్వత్రా వ్యాపించి ఉన్న అంధకారంలో మెరుస్తున్న నక్షత్రం దృష్టి గోచరమవుతుంది.

దార్శినికులు, వైజ్ఞానికులు ఇద్దరూ మారుతారు. ఈ వర్గం నుంచి నేటి సమస్యలకు పరిష్కారం చూపగలితే నవరత్నాలు అవిర్భవిస్తాయి. ఇటువంటి పరిస్థితులను నిర్మించడానికి నాపూర్తి యోగదానం (సహకారం) ఉంటుంది. కాని పరోక్షంగా ఉండటంవల్ల అందరూ దానిని చూడలేరు. గుర్తించలేరు.

# ధ్యాన ధారణల ప్రభావము - పరిణామము

శ్రద్ధ విశ్వాసాలను సమగ్రముగా సంపుటం చేసిన ఏకాగ్రతను ధ్యానమంటారు. పురాతన కాలంలో ధ్యానం దేవతల సాన్నిధ్యం పొందటానికి, వాని అనుగ్రహ వరదానాలతో లాభాన్విత మవ్వటానికి చేసేవారు. ఏ దేవతపై శ్రద్ధ ఉన్నదో ఆ దేవత యొక్క దివ్యమైన రూపము కల్పనా లోకములో కల్పన చేసుకొని దానిపై తన ప్రేమ భావసంవేదనల స్థితిలో జరుగుతుంది.దీని వల్ల సాధకుని మనోబలం పెరుగుతుంది. దేవానుగ్రహము పై విశ్వాసం లభిస్తుంది. ముందు ముందు ఇష్టదేవతతో మాట్లాడటం సాధ్యమవుతుంది. ఇచ్చి పుచ్చుకోవటాలు ప్రారంభమవుతాయి. కాని బండి ఎక్కడ ఉందో అక్కడే ఉన్నది. ఎందువల్లనంటే కల్పించిన దేవత యొక్క ప్రకటీకరణ. ఆదేవత యొక్క అకారణ అనుగ్రహ వర్షం సృష్టిక్రమ వ్యవస్థకు అనురూపంగా లేదు. రాబోయే రోజులలో సఫలత అసఫలతల కూడిన కాల చక్రంలో సఫలత యొక్క అంతమును దేవత యొక్క అనుగ్రహముగా భావించి మనస్సు యొక్క సహజ స్థితిగా భావించ వచ్చు.

ధ్యానం యొక్క వైజ్ఞానిక స్వరూపం ఏమంటే కల్పించిన లేక ప్రత్యక్షంగా నున్న మెరుస్తున్న బిందువు పై తన అంతర్ దృష్టిని ఇచ్చా శక్తితో సమన్వయం చేసి ఏకంత్రితం చెయ్యాలి. దీని వల్ల పరుగెత్తే మనస్సుకు కళ్ళెం వేసినట్టుంటుంది. ఏ విషయంపైనైనా మనస్సును లగ్నం చేయ వచ్చు. సూర్యకిరణములను భూతద్దము ద్వారా ఏకత్రితం చేయటం వల్ల మండటం జరుగుతుంది. అదే విధంగా చంచలమైన మనస్సు ఒకే విషయం పై కేంద్రీభూతం చెయ్యటం వల్ల దాని మేధక శక్తి అత్యధికమవుతుంది. దీనిని ఏ పనిపై లగ్నం చేసిన ఆ పనిని చక్కగా పూర్తి చేస్తుంది. వైజ్ఞానికులు కళాకారులు శిల్పులు ఈ విధముగా మనస్సును వికసింప చేసుకొని అభీష్ట ప్రయోజనములలో ఆశ్చర్యకరమైన ఫలితాలు ప్రాప్తింప చేసుకుంటారు. సర్కస్ కళాకారుల విశిష్ఠత ఈఏకాగ్రత సాధనపై ఆధారపడి ఉన్నది.

శారీరిక, మనసిక రోగ నివారణలో కూడా ధ్యానయోగము మంచి

లాభం చూపిస్తుంది. జీర్ణించి పోయిన అవయవముపై అది ఆరోగ్య వంతమవ ుతుందనే విశ్వాసంతో కూడిన సంకేతము నిర్దేశము ఇవ్వాలి. దీనిని విశ్వసించే వారు నిశ్చయంగా ఆరోగ్యలాభాన్ని పొందుతారు. ఈ పని ఎవరికి వారే చేసుకోవచ్చు, ఇతరులకు కూడా చేయవచ్చు. మెస్మరిజం, హిప్నాటిజంలో ఇచ్ఛాశక్తి అనేక ప్రయోజనములను సిద్ధింపచేస్తుంది. మానసిక వ్యాధులలో దీని ఉపయోగం చాలా లాభం కలిగిస్తుంది.

మస్తిష్కం యొక్క విభిన్న కేంద్రములలోని అతీంద్రియ క్షమతల భాండాగారం పడిఉన్నది. కాని అవి సుష్మప్త స్థితిలో ఉన్నాయి. ఏ మాత్రమైన, జాగృతం చేయగలిగాతే సాధకుడు దూరదర్శనము, దూరశ్రవణము,మొదలైన అనేక లాభములు పొందుతాడు. భౌతిక సంపదల వలె ఆత్మిక సంపదలు ఆర్జించుకోవాలి. దీని వల్ల వ్యక్తి తనకు ఇతరులకి లాభం చేకూర్చగలడు.

జైనులు, బౌద్ధులు, వేదాంతులు మొదలయిన వారు సాధరణ మానవులు స్వీకరించే విధంగా భగవంతుని స్వీకరించరు. నిరాకార భగవంతుని ఒప్పుకుంటారు నాద, బిందు, లయల ఆధారంగా తమ సాధనలు చేసుకుంటారు.

భృంగి కీటకముల న్యాయము ప్రఖ్యాత మైనది. రెండింటి మధ్య ఏకాత్మత సంవ్యాప్తమవటం వల్ల కలిగే ప్రభావం వాటి మధ్య ఇచ్చి పుచ్చుకోవటంలో చూడ వచ్చు. ధ్యాన ప్రక్రియలో కూడా దేనితోనైతే తాదాత్మ్యత, తన్మయత్వం స్థాపించకుంటామో దాని ప్రత్యేకతలు మనవైపు రావటం మొదలుపెడ్తాయి చందన వృక్ష సమీపములో ఉన్న చెట్లు చేమలు సుగందితమవుతాయి. ధ్యానములో శారీరక,ప్రత్యక్ష సమీపత లేనప్పటికి భావనాత్మక సమీపత వల్ల కూడా చాలా ఎక్కువ పొందవచ్చు ఈరోజులలో అనేక మంది నాస్తికవాదులున్నారు. వీరికి భగవంతుని మీద నమ్మకం లేదు.

జైనులు, బౌద్ధులు, వేదాంతులు మొదలయిన వారు సాధరణ మానవులు స్వీకరించే విధంగా భగవంతుని స్వీకరించరు. నిరాకార భగవంతుని ఒప్పుకుంటారు నాద, బిందు, లయల ఆధారంగా తమ సాధనలు చేసుకుంటారు.

పీఠికి సాకార ధ్యానం కఠినము. కాని ధ్యానం వల్ల లాభం పొందటానికి ఇది ప్రతిబంధం కాదు.

కళాకారులు వైజ్ఞానికులు, మెస్మరిజం చేసే వాళ్ళు ధ్యానం యొక్క లాభాలను భౌతిక ప్రయోజనముల కొరకు ఉపయోగిస్తుంటారు. వారికి ఆత్మోత్కర్ష గుణ, కర్మ, స్వభావములలో ఉత్కృష్టత వల్ల కలిగే ప్రయోజనములను వారు అర్థం చేసుకొన లేరు. వారికి పవిత్రత సంవర్ధనముల వల్ల కలిగే లాభం కలగదు.

ఇందు కొరకు సద్గుణములతో అభిప్రేరితమైన ఏదైనా పదార్థము లేదా వ్యక్తి ని ఒక నియమిత సమయమున సమగ్ర ఏకాగ్రతతో ధ్యానం చెయ్యాలి. పదార్థములలో గులాబి వంటి పూవు, మామిడి వంటి వృక్షము యొక్క విశేషతను అనుభూతి తనలో తెచ్చుకొనే ప్రయత్నం చేయాలి. వ్యక్తులలో వివేకానంద, గాంధీ,సుభాష్ చంద్రబోస్, వినోబా, దయానంద సరస్వతి, సత్యహరిశ్చంద్రుడు,భగీరదుడు లాంటి వ్యక్తులను వారి సేవాకార్యముల గురించి, గుణముల గురించి ధ్యానం చెయ్యవచ్చు. ఆసద్గుణములు తన వ్యక్తిత్వంలో ప్రవేశిస్తున్నాయనే విశ్వాసం కూడా ధ్యానం లో కలుపవచ్చు.

ఈ చింతన ఎంత తీవ్రముగా ఉంటే దాని ప్రభావము ఆ అనుపాతములోనే ధ్యానంలోను, విభూతులలో తనలో ప్రవేశిస్తూంటాయి. మరియు గుణ కర్మ స్వభావములో తన ఉత్కర్ష ఉట్టిపడుతూనే ఉంటుంది.

ధ్యానం యొక్క ప్రభావము ఎప్పుడైన ప్రత్యక్షంగా చేయవచ్చు, భూతప్రేతముల కథలలో కల్పనలలో మునిగి ఉండే వారు భయపడ వచ్చు, లేదా ఇతరులను భయకెట్టే ప్రవృత్తి వెలుపలికి వస్తుంది. అశ్లీల చింతనం వల్ల మస్తిష్కము తదనురూపంగా రంగు రంగుల ఉహలలో మునుగుతుంది. సాధనాత్మక దృష్టితో లేదా కనీసము ఆలోచనలను పరిష్కరించే దృష్టితో మనము శ్రేష్టత్వంతో జోడింపబడటానికి తగ్గిన ధ్యానం చేస్తే మంచిది.



# నిష్కామ సేవయే నిజమైన సేవ

శ్రామికులు సాయంత్రం దొరకే కూలి డబ్బుల కొరకు పగలంతా పని చేస్తారు. వ్యవసాయదారుడు, శిల్పి, కళాకారులు తమతమ పనులలో నిమగ్నమై ఉంటారు. ఎందు కొరకంటే తమకు లభించే ప్రతిఫలం కొరకే. వారికి లభించే ప్రతిఫలం తక్కువనిపిస్తే ఆ పనిని ఆపివేస్తారు. దొంగిలించిన వస్తువులు పంచుకునేందుకు ప్రతీకారం తీర్చుకునేందుకు, గోడకు కన్నాలేసే దొంగ చాలా చాకచక్యంతో వారి వారి పనులు చేస్తుంటారు. లోభి అధిక సంపదను కూడ బెట్టేందుకు ప్రణాళికలు వేస్తుంటాడు. వాటిని క్రియాన్వితం చేసేందుకు సర్వప్రయత్నాలు చేస్తాడు. విలాసులు విరి కోరికలు తీర్చుకునేందుకు తుమ్మెద ఒకపుష్పం మీద వాలినట్టు వీరు తిరుగు తుంటారు.

కొంత మంది తమ గొప్పదనాన్ని ప్రదర్శించి ఇతరుల కళ్ళు తిరిగేటట్లుచేస్తారు. వారు గార్ధభమైనప్పటికి సింహంలాగా జూలు విదిలిస్తారు. అమాయకుల దగ్గర తమ లేని గొప్పదనాన్ని, ఐశ్వర్యాన్ని ప్రదర్శిస్తారు. గొప్పలు పలుకుతారు. వారి పనూలు చేయించు కుంటారు.

కర్మ అందరు చేయవలసి వస్తుంది. అది లాభాప్రదమో? కాదో? కోతి ఒక కొమ్మ మీద నుంచి ఇంకోక కొమ్మ మీదకు కిచకిచలాడుతూ గంతులేస్తుంది. కొమ్మలు ఆకులు త్రుంచి క్రిందపడవేస్తుంది. ఈ నిరర్థక శ్రమకూడా దానిని సంతోషాన్ని ఇస్తుంది. కప్పలు బెకబెక లాడు తూంటాయి. కాని దీని వల్ల ప్రత్యక్ష ప్రయోజనం కనిపించదు. కాని అలవాటుకు బానిసై అలా చేస్తుంటాయి. నిశ్శబ్దంగా ఉండటం చాలా కష్టం.

పరోపకారలు చేసే వాళ్ళలో కూడా వారిలో దాగి ఉన్నకోరిక కనిపిస్తుంది. లోకులకు తమ ధర్మాచరణ ప్రదర్శనతో వారి సద్భవనల లాభం పొందాలని మనస్సు ఉవ్విళ్ళూరుతుంది. వారి ఆపోహలు సహజంగానే తేలికగానే లభిస్తాయి. వారి పేరు, పోటో అచ్చయితే ఇక చెప్పనే అక్కరలేదు పరోక్షలాభాల కొరకు చాలా మంది మనుష్యులు జనసేవలను ఆధారం చేసుకుంటారు. నేతలవాలని ఖ్యాతిని ఆర్జించాలని ప్రయత్నిస్తారు. దీనితో అనేక మంది. జనసహయోగం లభించగలదు.

ప్రపంచం వినోదభరితమే కాని ఆత్మ సంతోషం నిస్వార్థ సేవాధర్మం

ద్వారా లభిస్తుంది. తమ స్వార్థాన్ని విడనాడి, ఇతరుల దుఃఖమును పంచుకొనటం వల్ల తన సుఖమును ఇతరులకు పంచటం వల్ల ఆత్మ సంతోషము వాస్తవిక ఆనందం పొందవచ్చు. దీనికి ఒకే మార్గముంది. నిస్వార్థ సేవాసాధన, సత్ప్రవృత్తుల సంవర్ధనము. ప్రదర్శన కొరకు దరిద్రులకు సహాయం చేయటం ఆత్మద్రోహమే. చూపే, సహాయం ఎలా ఉండాలంటే తమ అహంకారం పెరగకుండా చూచుకోవాలి. అలాగే సహాయం స్వీకరించిన వారి స్వాభిమానం దెబ్బతిని, దీన హీనుల పంక్తిలో నిలుచునేటట్లు ఉండకూడదు. దీని వల్ల ఆపదలో ఉన్నవారికి సకాలంలో సహాయత లభించి, ఆవ్యక్తి ఎంత సమర్థ వంతుడవు తాడంటే తన కాళ్ళమీద తాను నిలబడ గలడు. తన పని తాను చేసు కోగలడు.

సహాయం పొందిన వారు, వారు ఇతరుల నుండి అనుభవించిన ఉదారతను ఒక ఋణములాగా భావించాలి. అభావగ్రస్తులకు సహాయం చేసి అఋణ వియుక్తి గావాలి.

## సహస్రకుండీయ యజ్ఞము.

4-11-98 వతేదీ కార్తీక పూర్ణిమ రోజున ఉదయం నరసరావుపేట నందు సహస్ర కుండీయ గాయత్రీ మహా యజ్ఞము జరుపుటకు కార్యక్రమము నిశ్చయమైనది కావున కార్యకర్తలు మరియు కార్యక్రమంలో పాల్గొనదలచిన మిత్రులు అందరూ చాలా రోజుల తరువాత జరుగుతున్న ఈ మహత్తం కార్యక్రమాన్ని వినియోగించకోండి.

వివరములకు.

జి. మల్లిఖార్జునరావు,

వైశ్యాబ్యాంకు,నరసరావుపేట.



# అంతఃకరణ పరిమాణము

స్థూల, సూక్ష్మ, కారణ శరీరాల గురించి మనకి తెలుసు. దానినే కోశముల పేర్లతోఐదు విధాలుగా విభజించి చెప్పటం కలదు. 1).అన్నమయము(స్థూలశరీరం) 2).ప్రాణమయము 3).మనోమయము (4)విజ్ఞానమయము(2,3,4,సూక్ష్మశరీరభాగములు) 5).ఆనందమయము(కారణశరీరము) అని వాని పేర్లు. అవి ఒక దానిలో నొకటి పూర్ణముగ వ్యాపించి యుంటవి. అనగా అన్నమయకొశమగు స్థూలశరీరంలో అంతటా వ్యాపించి ప్రాణమయకోశం ఉంటుంది. దానిలో అంతటా వ్యాపించి మనోమయకోశం. అట్లే మనోమయములో విజ్ఞానమయం. దానిలో ఆనందమమయం వ్యాపించి ఉంటాయని చెప్పుదురు.

దీనిని బట్టి మనోమయ, విజ్ఞానమయ కోశములు కూడ మధ్యమ పరిమాణంతో శరీరమంతట వ్యాపించి యుండనని తేలుతుంది. ఆమనోమయ, విజ్ఞానమయ కోశములు రెండు అంతఃకరణము శిరస్సు లోని మస్తిష్కమునందే ఉండునని (మధ్యమపరిమాణం= శరీరమెంతయున్న అంతటి పరిమాణమని చెప్పట యెట్లు పొసగుతుంది. శరీరమంతటా నుండవలెను గదా! అను ప్రశ్న కలుగుతుంది. కనుక దానికి సమాధానం చెప్పవలసియున్నది.

జీవుని సంకల్ప వికల్పాది వృత్తులకు సాధనం అంత కరణము. దానిని వృత్తి భేదమును బట్టి లేదా అవస్థా భేదమును బట్టినాల్గ విధములుగా చెప్పుతుంటారు. అవి మనో, బుద్ధి, చిత్త, అహంకారములు. సంకల్ప, వికల్పాత్మకము బుద్ధి, స్మరణాత్మకము చిత్తము. ధృతి యొక్కఅభిమానాకార వృత్తి అహంకారము.

ఇట్టి అంతః కరణము ప్రాణమువలెనే శరీరంలో అంతటా వ్యాపించి యుంటుంది. ప్రాణము, అంతఃకరణము కలిసియే జ్ఞాన క్రియాతంతువుల ముఖ్యకేంద్రము మస్తిష్కము. అక్కడి నుండియే యాతంతువులు శరీరమంతటా వ్యాపించియుటాయి. జీవాత్మనివాసం కూడా మస్తిష్కంలోనే.

జీవుడు(మనుష్యుడు)కొండొక విషయమును నిర్ణయించుటకు పూను కొనినపుడు బాహ్యేంద్రియముల ప్రవృత్తి నరికట్టును. మొత్తము

అంతరింద్రియమగు మనస్సు (అంతఃకరణము) తో నాలోచింపదొడగును. అప్పుడు జ్ఞానతంతువుల కూడలియగు మస్తిష్కంలో ఒత్తిడి యేర్పడుతుంది. ఆఒత్తిడి ఉరము లోగాని, నాభిలోగాని, శరీరమున మరొక చోటగాని యెక్కడా ఏర్పడదు. ఇది అందరికీ అనుభవంలో ఉండేదీ. సందేహింపవలసిన పనిలేదు. కాని అంతఃకరణము యొక్క ప్రధానకేంద్రము మస్తిష్కమని తలంపబడుచున్నది. శరీరమాంతటా జ్ఞాన క్రియా తంతువులలో వ్యాపించియున్న అంతః కరణమునకు మస్తిష్కముతో సంబంధము ఉన్నది.

అంతఃకరణము యొక్క ప్రధాన కేంద్రం మస్తిష్కమనుటలో మరి కొన్ని కారణములు కలవు. వానిలో ఒకటి ఆత్మకు సన్నిహింతసాధనం అంతఃకరణము(మనస్సు). ఎందుకనగా కొండొక విషయమును గ్రహించుటకు ఆత్మ మనస్సును మనస్సు ఇంద్రియములను ప్రేరేపించుట జరుగును. జ్ఞానేంద్రియముల సంనివేశము కూడా మస్తిష్కములో కలదు. కాన నాయింద్రియముల ప్రేరేపించు నంతఃకరణము దానిని ప్రేరేపించు నాత్మయు మస్తిష్కములోనే ఉండక తప్పదు.

రెండవ కారణము ఆత్మ నివాసము మస్తిష్కములో. అందువలన ఆత్మకు అంతరంగ సాధనమైన అంతఃకరణము యొక్క ప్రధాన స్థానం కూడ మస్తిష్కంలో ఉండవలెను.

దీనిని బట్టి గ్రహింపదగు సారాంశ మేమనగా? అంతఃకరణము శరీరమంతట వ్యాపించి యున్నను దానిని ఉపయోగించుకొను జీవాత్మ మస్తిష్కములో నున్నాడు. కానతనతో పాటు మస్తిష్కము నున్న అంతఃకరణ భాగములో అతడు ప్రేరణ కలిగించును. అయ్యది తనతోపాటు మస్తిష్కము నందున్న ఇంద్రియుములకు ప్రేరణ కలిగించును ఇంద్రియములు శక్త్యాత్మకములు. వాని కేంద్రము మస్తిష్కము. ఇట్లు జీవుని ఉనికిని బట్టి యాతని అంతరంగ సాధనమైన అంతఃకరణమునకు కూడా మస్తిష్కము స్థానముగా చెప్పబడుచున్నది. అంతమాత్రమున అంతఃకరణము యొక్క మధ్యమ పరిమాణమును శంకింప బనిలేదు.





## నిరంతర గురుసాన్నిధ్య అనుభూతి సాధన

### శిబిర దినచర్య

4.30 TO 5.20A.M నిద్రలేచుట, అ కార, ఉ కార, మ కారాత్మక ఓం కార ఉచ్చారణ 7 సార్లు, ఒక్కసారి అనుగ్రహమాలా మంత్ర ఉచ్చారణ, ఆత్మబోధ; స్థలప్రదక్షిణ, గురుపాదుకాస్తవం, సూర్యనమస్కారాలు-5సార్లు, కాలకృత్యాలు.

5.20 TO 5.30A.M యజ్ఞ సామగ్రిని సమకూర్చు కొనుట.

5.30 TO 7.00A.M యజ్ఞము అగ్ని స్థాపన వరకు చేసి భగవద్గీత ఆహుతులు.

7.00 TO 7.30A.M టీ విరామము.

7.30 TO 8.30A.M గాయత్రీ, దత్తాత్రేయులకు షోడశ ఉపచార పూజ మరియు దత్త, గాయత్రీ సహస్రనామ పారాయణ.

8.30 TO 9.30A.M అనుగ్రహమాలా మంత్ర జపం - 1 వ సారి.

9.30 TO 10.30A.M మౌనం, స్వాధ్యాయం -క్యాసెట్లు వినుట.

| | | |
|---|---|---|
| 10.30 TO 11.30A.M | | అనుగ్రహమాలా మంత్ర జపం - 2 వసారి. |
| 11.30 TO 12.30 | | అనుగ్రహమాలామంత్ర ఆహుతులతో యజ్ఞము. |
| 12.30 TO | 2.30P.M | ఫలాహారం, విశ్రాంతి. |
| 2.30 TO | 3.30P.M | మౌనం;యజ్ఞశాలను శుభ్రపరుచుట. |
| 3.30 TO | 4.30P.M | అనుగ్రహమాలా మంత్ర జపం -3 వ సారి. |
| 4.30 TO | 4.45P.M | యజ్ఞమునకు సిద్ధపడుట. |
| 4.45 TO | 6.30P | దుర్గాసప్తశతి అహుతులతో యజ్ఞంపూర్ణాహుతి, పరిసమాప్తి. |
| 6.30 TO | 7.30P.M | ఉపన్యాసం. |
| 7.30 TO | 8.00P.M | ప్రశ్నలు, సమాధానాలు. |
| 8.00 TO | 8.15P.M | దత్తప్రదక్షణలు. |
| 8.15 TO | 9.00P.M | భోజనం, నిద్రకుపక్రమణ. |

ఇప్పుడు యజ్ఞం 3 సంధ్యలలో జరుగు తుంది. అయితేపూర్ణాహుతి మాత్రము సాయంత్రము ఇవ్వాలి. అలాగే గీతలోని మొత్తం శ్లోకాలతోగాక కేవలం సాత్విక శ్లోకాలను ఏరి వానితోనే ఆహుతులు వేయబడుతున్నాయి. ఇంకా ఖచ్చితంగాఅవి పరిష్కరింప బడలేదు. అన్నీ అయిన తరువాతత్వరలోనే సాత్విక శ్లోకాలు తెలిప బడతాయి.







# సర్వలోకేశ్వరీదేవి అవతరణ

మన పరివార్ వారికి ఒక ఉత్సాహభరిత మైన వార్త. ఎంతటి ఉత్సాహభరిత మైన వార్తో, అంతటి బాధ్యతలను కూడా తలపై పెడుతున్న వార్త ఇది. మన ఈ నిరంతర గురుసాన్నిధ్య అనుభూతి సాధన శిబిరము లో అనేక దివ్య శక్తులు దిగుతున్న విషయము మీకుతెలిసిందే. ఈనాటివరకు ఏ యుగంలో గాని, ఏ కాలంలో గాని భూమికి రానటువంటి విచిత్రమైన దివ్వశక్తి ఈ భూమి మీద దిగింది. ఆశక్తి ని నేను సర్వలోకేశ్వరి అనే పేరుతో సంబోధిస్తున్నాను. 7 ముఖములతో, 14 0చేతులతో, పృథ్వీయే వాహనంగా కలిగివున్న ఈ సర్వలోకేశ్వరీదేవి భూమి పై అవతరించినది.

ఇది ఏవిధముగా రూపొందుతుందో? ఏపరిణామక్రమం వైపు పయనిస్తుందో? ఏవిధమైన క్రొత్త చేతనత్వ స్థితులను తెస్తుందో తెలియదు. మనకున్న స్థూల, స్థూక్ష్మ, కారణ, తురీయ స్థితులు కాకమరో 3 చైతన్య స్థితును ఈశక్తి తీసుకొని రానున్నది. వీటన్నిటిని గురించి సాధనలతో పూర్తి వివరాలు తెలుసు కొవలసివుంది. దానికిగాను ఈశక్తి ఏగ్రహల నుండి వస్తుంది. ప్రకృతిలోని ఏనియమాల ననుసరించి వస్తుంది? ఏవిధమైన సాధనలతో ఉపాసన చేయాలి? అనేది ఇంకా అర్థం కావటం లేదు.

అందుచేత ఈ వింత, విచిత్ర, క్రొత్త శక్తిని ఉపాసన చేసి దాని ప్రకృతి నియమాలను అవగాహన చేసుకుంనేందుకు దానిని పరిష్కరించేందుకు నాతో పాటు మీరూ ప్రయత్నించాలి. మరి ఏం చేయాలి? మాన వలన అవుతుందా? అని మాత్రం అనకండి. ఎందుకంటే పూజ్యగురుదేవులు మనకు ఓఅద్భుత తాళం చెవిని ఇచ్చారు. అదే గాయత్రి గాయత్రీ ఉపాసనతో సృష్టిలోని అన్నిశక్తుల తలుపులు తెరుచుకుంటాయి. దయానందసరస్వతి ఆయనగురువైన విరజానంద, పండిత శ్రీరామశర్మ ఆచార్య ఆయన గురువు సర్వేశ్వరానందల ప్రయత్నంతో ఇది సంభవము అయినది.

ట ా వ ు న

ప్రతిసాధకుడు ఈప్రయత్నములోతమ వంతు కృషి చేయాలి. దివ్వశక్తుల ఆవిష్కర మహాయజ్ఞంలో పాల్గొన్నామనే ఓగొప్ప అనుభూతిని వదులుకోకండి. తిరిగి మరలా ఈ అవకాశాం రావాలంటే కోట్ల సంవత్సరాలు పడుతుంది. కనుక జాగ్రత్తపడండి.

( 9-9-98వ తేదీ శ్రీరామకృష్ణ గారి ఉపన్యాసం నుండి )

గురుదేవులు శ్రీ శ్రీరామకృష్ణ గారి ఇంటి వద్ద నిరంతర గురుసాన్నిధ్య అనుభూతి సాధనా శిబిరము నందు దేవీ నవరాత్రుల పూర్ణాహుతి సందర్భములో తీసిన చాయా చిత్రము ఇది. దివ్యశక్తుల ఆవిష్కరణ ఏవిధంగా జరిగిందో గమనించండి. ఈ చాయా చిత్రాన్ని గురించి శ్రీ శ్రీరామకృష్ణ గారు ఏంఅంటున్నారో చూడండి.



మంత్రము యొక్క శక్తితో బాహ్య జగత్తులో వెలిగించిన జ్యోతి ఒక సవ్యమైన దృష్టి కోణముగా మారి సాధకుని అంతఃకరణము లోనికి ప్రవేశిస్తుంది అన్నదానికి నిదర్శనంగా నిరంతర గురుసాన్నిధ్య అనుభూతి సాధన శిబిరములో తీసిన ఈ చిత్రము తెలుపుతోంది. ఎదురుగుండా మండపములో ఉన్న దేవతా విగ్రహాలు దానికి ఎదురుగా ఉన్న చిన్న దీపము కూడా పాల పుంత లాంటి వెలుగును ప్రదర్శింరచటం గమనించాలి. యజ్ఞం వల్ల ఆస్థలంలో కురిసే పర్జన్య వృష్టికి అది నిదర్శనమేమో.



# మూలాధారచక్రజాగరసాధనా శిబిరము

గత నవరాత్రులలో ధరణి దీక్ష అయినది కనుక పృధ్వీ యొక్క కుండలనీ జాగరణ కార్యక్రమాన్ని చేపట్టవలసి అవస్యకతను గుర్తించిన శ్రీ రామకృష్ణ గురుదేవుల ఆదేశము మేరకు నవంబరు 20, 21, 22, తేదిలలో పృధ్వీ యొక్క మూలాధార కేంద్రమైన శ్రీశైల పుణ్యక్షేత్ర మందు మూలాధారజాగరణ సాధాన శిబిరము జరగనున్నది. ఈ శిబిరములో పాల్గొనదలచుకొన్నవారు **నవంబరు 15వ** తేది లోపు నాకు ఫోన్ చేసి మీ మీ కేంద్రముల నుండి ఎంత మంది వచ్చుచున్నారో తెలుపవలెను. 19వ తేదీ రాత్రికి సాధకులందరు శ్రీశైలం నందలి రెడ్డిగారి సత్రమునకు రావలెను. ఈ శిబిరమునకు గాను ఫీజు రూ. 300/- నిర్ణయించటమైనది.

చిరునామా :
వై. పి. రామసుబ్బయ్య,
పాత పట్టాభిపురం, 2వ లైను,
గుంటూరు - 522 006.
H 353164 (0863)

ఇట్లు
వై. పి. రామసుబ్బయ్య,
కన్వీనర్,
దేవమాత గౌతమీ ట్రస్టు.

సంవత్సర చందా : 36/-లు — జీవిత చందా : రూ. 450/-లు

PRINTED MATTER — BOOK-POST

TO

Printed and Published by Smarthugami Publications (PVT) Limited., Guntur. Editor : I. Vijaya Bhasker Reddy, Cross Roads, Santhamagulur (P.O. & Mandal) Prakasam Dt., Pin : 523 302.